క. నూవుంబూవును సంపెగ
పూవుఁ గెలిచి బిరుదుముత్తెపుంజల్లి దగం
దావైచె ననఁగ ముంగర
త్రో వనరుహనేత్రనాస తులలే కొప్పున్.

౬. చారుదేష్ణచరిత్రము—

గీ. అచ్చరలు నందనంబునఁ బెచ్చుకొనుసు
రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁ గాలూఁది తత్పురస్త్రీల కొసఁగి
వేఁడికొనిపోవుదురు కప్రవిడియములు.

క. ఈలలన వేలుపుంజవ। రాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కాక। భూలోకస్త్రీల కిట్టిపొంకము కలదే?

౭. భేతాళపంచవింశతి—

ఉ. చోరగ్రాహగజాంకుశంబు నలినీశుంభన్మదేభంబు ది
క్నారీమూర్తికదర్పణంబు రజనీకాంతామనోహారి వి
స్ఫారాంభోధితరంగకారి గిరిజాప్రాణేశభాస్వజ్జటా
శ్రీరమ్యాభరణంబు చంద్రుఁ డుదయించెన్ సుప్రభాభాసియై.

ఉ. ఆనిధవాశిరోమణి రయంబునఁ బోయి రహస్యవేశ్మఁ బ
ద్మావతిఁ గాంచి రాజసుతుఁ డాడినమాటలు విన్నవింప ల
జ్జావతి దానిఁ జూచి ఘనసారకరంబుల గండపాళికల్
వావిరి వ్రేసినన్ జరరవారిజలోచన వచ్చె ఖిన్నతన్.

౮. చమత్కారరామాయణము—

క. ఓశశిముఖి లోపాము
ద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట సతతము తపో
రాశి మహాత్ముఁడు మును పా
పోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్.

క. నిన్నుఁ జెఱఁగొన్న హైహయు
కన్నఁగా దోర్వీర్యమెక్కుడగు భార్గవు లీ
ల న్నిర్జించినరామున
కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే?

౯. శేషధర్మములు—

క. పెట్టఁడు నారకమార్గం
బెట్టి మహాక్రూరకర్ముఁ డేసియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున
నెట్టన హరిఁ దలఁపఁ గలిగెనేని మహాత్మా.

౧౦. విజయసేనము—

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసందగు లూఁది యిమ్మొయిన్
దల్లడ మంజెదేల యుచితస్థితికి న్ననుఁ బాపఁజూచినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నేమనువారెఱింగరే
మల్లమ యిట్లునీకుఁ దగునో తగదో పరికించిచూడుమా.

౧౧. దేవీవిజయము—

గీ. వాక్ర్కోశనేత్రాంగనాశచీశకు లధిక
సంభ్రమంబునఁ గుంభనిశుంభదైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీమంత్రములను
స్తోత్రములుచేసి మంగళారాత్రికలిడి.

౧౨. మధుసేనము—

క. పో నుద్యోగము చేసిన। ప్రాణంబా యింకనీకుఁ బాథేయం బీ
మానినిమందస్మితమధు। రాననచంద్రికలు గ్రోల నరుగుము పిదపన్.

౧౩. అనిరుద్ధచరిత్రము — కనపర్తి యబ్బయామాత్యప్రణీత మయిన యీపేరుగల యాధునిక ప్రబంధమొకటి కలదుగాని యీక్రింది పద్యము పూర్వగ్రంథములోనిది—

5. సతీమణి విజయము
6. సుమిత్ర చరిత్రము
7. రాముదేవరాజీయము
8. తురంగేశ్వర వర్తక చరిత్రము
9. కళావతీ పరిణయము
10. గయ్యాళిని సాధుచేయుట
11. చిత్రకేతు చరిత్రము
12. దానకేసరీవిలాసము
13. వైదర్భీవిలాసము
14. భానుమతీ కళ్యాణము
15. సరసిజనయనోభిరామము
16. ధర్మకవచోపాఖ్యానము
17. కుమారద్వయవిలాసము
18. పద్మినీప్రభాకరము
19. మాలతీమధుకరము

## స్త్రీలకుపయోగించు పుస్తకములు

ఆఱవ సంపుటము

1. శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2. సతీహితబోధిని
3. పత్నీహితసూచని
4. స్త్రీ నీతిదీపిక
5. సత్యాద్రౌపదీ సంవాదము
6. మాతృపూజ పితృపూజ
7. నీతికథామంజరి ప్ర॥ భాగము
8. డిటో ద్వి॥ భాగము
9. దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1. జన్మాంతరము
2. అతిబాల్య వివాహము
3. విగ్రహారాధనము
4. ఈశ్వరదత్త పుస్తకములు
5. ఈశ్వరోపాసనము
6. ప్రార్థన
7. మానుషధర్మము
8. విద్యార్థుల ధర్మములు
9. మనుష్యజీవితముల యొక్క పరమార్థము
10. వైరాగ్యము
11. విద్యాధురీణుల యర్హ్యకృత్యములు
12. పర్వము
13. హిందూమతములు
14. స్వయంకృషి
15. సకాయకష్టకర్మలు
16. వేశ్యాకాంతల యుప॥
17. ఐకమత్యము
18. దానములు
19. స్త్రీ పునర్వివాహచరిత్రం
20. స్త్రీ పునర్వివాహవిషయకోపన్యాసం
21. స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనము
22. స్త్రీ పునర్వివాహ విషయక ద్వితీయ విజ్ఞాపనము
23. స్త్రీ పునర్వివాహశాస్త్ర సంగ్రహము
24. స్త్రీ పునర్వివాహ భూతవర్తమాన స్థితులు

## ఉపన్యాసములు - జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1. దేశీయమహాసభ దాని యుద్దేశము
2. శంకరాచార్యులు

పుస్తకములు వలయువారు :—

కార్యదర్శి, హితకారిణీ సమాజము. రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.